

సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100028427

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# భక్త జీవన శతకము

## అంకితం

శ్రీ యోషా హృదయాబ్జబంభరవరా!
శేషాహి తల్పా! మహా
మాయామోహిత విశ్వభార భరణా
మాతంగ సంరక్షకా!
మీయత్యంత కృపారసంబుఁదగనా
మీఁదం బ్రసారించి నే
జేయంబూనిన చంపకోత్పల సుమ
శ్రేణిఁ హరీ! కొమ్మిఁకన్.

రచన

వాసా కృష్ణమూర్తి

మదనపల్లె

తిరుమల తిరుపతి దేవస్థానము వారి
ఆర్థిక సహాయముచే ముద్రింపబడినది.

# విజ్ఞప్తి

పాఠక మహాశయులారా !

ఈ శతకమును రచించుట లో నాకు సుశిక్షిత పాండిత్యము లేకున్నను, శ్రీరామ చంద్ర పాదారవింద భక్తి కారణముననుపూర్వ జన్మ కృత సుకృత ఫల లేశంబువలనను, మదుపాసిత శారదాదేవీకరుణా కటాక్ష వీక్షా ప్రసాదమువలనను నేనీ పుస్తకమును వ్రాయఁ గలిగితిని.

ఇందులకుఁ బండిత సాహచర్యమొకింత తోడ్పడినది. విద్యావంతుల పరిచయమును గూర్చి యుదాహరణము

శ్లో॥ కాచః కాంచన సంసర్గా, ద్ధత్తే ఆరకూటద్యుతిం
తథా సత్సన్నిధానేన, మూర్ఖో యాతి ప్రవీణతాం

పై శ్లోకముననుసరించి విద్వాంసుల మైత్రి యెంతయో సహకరించును. పోతనామాత్య వాసుదాసాది కవిచంద్రుల వలె మహా కావ్యపురాణాదుల వ్రాయలేక పోయినను, 'ఉడుతబత్తి'యను సామెతననుసరించి యీ గ్రంథ రచన గావించితిని.

పది సంవత్సరముల వయస్సు నందు గ్రంథ రచనగావించుట వలనను రచన ప్రథమ ప్రయత్న మగుట వలనను దొసగులుండునని బ్రహ్మశ్రీ కావ్య పురాణ తీర్థ జనమంచి వెంకట సుబ్రహ్మణ్యశర్మ గారి కడకు బంపగా వారు సహృదయులై పరిశోధించి పరిచయమును సయితము వ్రాసి పంపిరి. వారికినా కృతజ్ఞతాపూర్వక వందనములు. వారి సవరణవలన సువర్ణంబు పుటంబుచే వన్నె గాంచునట్లు నా యీ రచనకు గీర్తి చేకూరినది. అందులకే కాళిదాసు గారు 'హేమ్న స్సంలక్ష్యతేహ్యాగ్నౌ విశుద్ధి శ్శ్యామికాపి వా' అన్నారు.

తదుపరి నాకు గురువులు గా నుండిన మా మామగారు ను, పోషక జనకులునగు నాగులయ్య గారు నాకు తగిన ప్రోత్సాహమును గలిగించి మంచి సలహాలతో స్ఫూర్తిని గలిగించుచు సహకరించిన వారికి నా నమస్సుమాంజలులు.

మరియు తిరుమల తిరుపతి దేవస్థానము వారి ధన సహాయమునకై యుత్సాహపరచి ప్రయత్నింపజేసిన శ్రీగాడేపల్లి శివరామయ్యగారు, శ్రీమల్లెల గురవయ్యగారు, శ్రీపురాణం త్యాగమూర్తి శర్మగారు, శ్రీమేడ వరం వేంకట నారాయణ శర్మ గారు మొదలైన పెద్దలకు నా నమస్కృతులు.

నా సాహిత్య చర్చా ప్రవేశమునకు మూల కారకులగు హిందీ పండితులు కీ॥శే॥ కవికులం నారాయణాచార్యులు గారికి వందనములు.

ఈ పుస్తక ప్రచురణ ప్రక్రియలో సందర్భోచితంగా సహాయ సహకారములందించిన శ్రీకరణం బాలసుబ్రహ్మణ్యం పిళ్ళై గారికి, శ్రీసి.వి.రాజా రావు గారికి, లాయరు శ్రీజయనారాయణ రెడ్డిగారికి, సకాలంలో మా అభిరుచికి తగిన విధంగా ఈ పుస్తకమును ముద్రించి యిచ్చిన యస్. ఆర్. గ్రాఫిక్స్ R.B.రెడ్డి గారికి నా కృతజ్ఞతలు.

ఇందులో యికను లోపములున్న సవరించుకొనుటకు తగిన సలహాలనివ్వవలసినదిగా చదువరులగు సహృదయులకు విన్నవించుకొనుచున్నాను.

ఇట్టి రచనల నితోధికయశస్సును గాంచుటకై వ్రాయు మహత్వ కవిత్వ పటుత్వమును ప్రసాదింపుమని శ్రీరామచంద్ర భగవానుని, భారతీదేవిని ప్రార్థించుచున్నాను.

ఇట్లు

ప్రమాది ఆశ్వయుజ బహుళ తదియ — భక్తాంఘ్రి రేణువు.

27-10-99. — వాసా కృష్ణమూర్తి.

# పరిచయము

శతకము భక్తి సంభరితము, గ్రంధకర్తను చూడలేదు గాని తత్కృత గ్రంథమును సంపూర్ణముగఁ బఠించితిని. **రూపమే వాస్య మహిమానంవ్యాచష్టే** అను శ్రుతి ప్రమాణముగా ఈ శతకమునందుగల రచనా విశేషమే కర్త యొక్కయితి వృత్తమును దెలుపుచున్నది.

లోకమున దనకవితచే బ్రశస్తికెక్కవలయుననుఁ దలంపునగాక కేవల భక్త్యుత్సాహప్రపూరిత హృదయుఁడై శతకముఁ బద్యరూపమునఁ గవి తన భావంబులను వెలిబుచ్చి నాడనవలయును. **చంపకోత్పల సుమశ్రేణీ హరీ! కొమ్మీఁక** అని భగవంతునకు పద్యపుష్పహారము నొసఁగఁ దలఁచినట్లు అంకితమునసే తెలిపియున్నాఁడు. అనుకొన్న నియమము తప్పక భగవంతునకర్పించుట యెంతయు గొనియాడఁదగిన విషయము.

మొదట భగవంతుని లీలావతారములగు మత్స్యాద్యవతారదశకమును వర్ణించుటలోఁగల కవి యొక్క పౌరాణిక పరిచయము నిరుపమాన మనవలయును. తరువాత రామకృష్ణావతారములలోని విశేషవిషయములతోఁ గూడిన లీలల నుతించుటలో రామాయణ భారత భాగవతములందు వీరు చేసిన పరిశ్రమ తెల్లమగుచున్నది. మొత్తము మీఁద భగవన్నుతి కేవలము ప్రకటనార్థముగా నిందు కవి వెలయుంపలేదు. తదేకాగ్రచిత్తముతో నమ్మి నుతి చేసిన విధము కన్పడుచున్నది. కూర్చిన సమాసములతి హృద్యములు. అంత్య ప్రాసాది శబ్దాలంకారము లతి మనోహరములు. ఈ శతక రచన ప్రథమ ప్రయత్నముగా నుండ వచ్చును. అయినను ధార నిరంతరాయముగా సరళమై సాగినది. శ్రీరామచంద్రుని కరుణాకటాక్షమే యిందుకు హేతువని నమ్మ వలయును. భగవద్భక్తులకందరాని పదవులుగలవేయని యెల్లరు దలంపవలయును.

ఇందుఁ గేవలము భక్తియుత పద్యములే గాక లోకానుభవమును పెంపొందించు నీతులును గలవు. ఇవి సమాజసేవ కెంతయుఁ దగి యున్నవి. వాసా కృష్ణమూర్తిగారు శ్రీరామచంద్రానుగ్రహమున భక్తియుత శతకములేగాక దేశసేవ కుపకరించు గ్రంధములను సయితము వ్రాసి భాషా సేవతో బాటు లోకసేవనుగూడ జేయుదురు గాక. భాష నానావిధముల, **రోటికొక్క పాటగా** చెడుచున్న యీ కాలములోఁ బ్రాచీన మర్యాద ననుసరించి యీశతకము వ్రాసిన కవి యుద్యమము ప్రశంసార్హము.

చెడని త్రోవ యిదియని యెఱింగిన వీరియుద్దేశమును శ్రీరామచంద్రమూర్తి యభివృద్ధినొనరించు గాఁక. శ్రీరామమూర్తి వీరికి దివ్య భవ్య కవితా ప్రసాదము ననుగ్రహించి చిరాయురారోగ్యభాగ్యముల నొనగూర్చునుగాక. సహృదయులు వీరి గ్రంధములకుఁ జేదోడు వాదోడై ప్రోత్సహింతురుగాక.

ఇట్లు

శ్రీలలితా విలాసము
నందన ఫాల్గున పూర్ణిమ

విన్నవించుకొను భవదీయుడు
జనమంచి వెంకట సుబ్రహ్మణ్య శర్మ.

## వినాయక స్తుతి

కII నాయకుడై గణములకు వి
నాయకుడిల బ్రోచుననుచు నమ్మిన విద్వ
న్నాయకుల బ్రోచు స్వామిని
నా యకుటిల రచన సాగ నతులొనరింతుఀ.

## అంబికా త్రయ త్రిమూర్తి స్తుతి

కII భారతి నిందిర నుమలఀ
వారిజ సంభవుని వికచ వనజ దళాక్షుఀ
గౌరీవల్లభు గొలుతుఀ
చారుతరంబైయలరెడు. శతకము వ్రాయఀ.

## శ్రీ రామ చంద్రస్తుతి

శాII శ్రీరామామణి మేదినీ తనయగా, శేషాహి సౌమిత్రిగా
స్ఫారోదంచిత శంఖ చక్రయుగళీ సంపూరితాంశోద్భవుల్
దూరీ భూతమహాఘులా భరత శత్రుఘ్నాహ్వాయుల్గాగ, స
త్కారుణ్యాత్ముడు శౌరి దాశరథి యా దైవంబు నే గొల్చెదఀ.

## శారదా స్తుతి

ఉII సేవిత భక్త పోషిణి, కుశేశయ సంభవు రాణి, విద్యకుఀ
దావల మైన కొమ్మ, సిత తామరసానన, భృంగ వేణి, వీ
ణావర దండ హస్త, భువనంబులకెల్ల ను మాత, శారదా
దేవి దయారసంబున మదీయ హృదిఀ వసియించుగావుతఀ.

## గురుపత్నీ స్తుతి

కII శ్రీరామ సారస ప్రియ
సారద్యుతి భాసితాత్మ. సారస, శాంతా
సారస లోచన, మద్గురు
సారసలోచన నుతింతు సాక్షాల్లక్ష్మిఀ.

## గురు స్తుతి

ఆII నాగులయ్య గారు నా గురు దేవులు
వారు ఘనముకల సు వంశభవులు
వారి చరణ కమల వందనం బొనరించి
శతక రచన జేయు సాహసింతు.

- వాసా కృష్ణ మూర్తి -

## కవి స్తుతి

గీ॥ వాసిగన్న వల్మీకజ. వ్యాస కాళి
దాసనన్నయ శ్రీనాథ. వాసు దాస
పుట్టపర్తి శ్రీపాదాది. ముఖ్యులైన
సంస్కృ తాంధ్ర కవీంద్రుల. సన్నుతింతు.

## కవి వంశస్తుతి

గీ॥ శీల సంపద రక్షించు. సాలెవంగ
డంబు నందున జనియించి. డంబుమీరి
మాన్యులగు చంగమాంబకు. మల్లయకును
ప్రథమ పుత్రుడ గృష్ణాఖ్య. వరలువాడ.

## కవి గ్రామ వర్ణన

క॥ మా కన్నెమడుగు నగరపు
జోకన్ వర్ణింప దమ్మి – చూలికి గానీ
యేకతన సాధ్యమగు భూ
లోకపు టల కాపురమ్ము. లోకమునందున్

సీ॥ పల్లె చుట్టును కోట. పగిది రాణించెడు
సొగసైన మేల్సజ్జ, జొన్న చేలు
మేడల వలె మంచి. నీడల నిచ్చుచు
రంజిల్లు చుండు పెట్రమాకులగ మి
కన్నుల పండువౌ. కమ్మని దినుసుల
రంగైన యెన్నియో యంగడులును
మేలిమి వాసనల్ మెచ్చగు చవులీను
పూవుల పండ్ల సొంపుల బజార్లు

గీ॥ జ్ఞాన పద లక్ష్మి చుట్టిన సరిగలంచు
టాకు పచ్చ తళుక్కుల పట్టు కోక యనగ
వెన్ను వదలెడి వరి మళ్ళు వెలయుచుండ
కాంచ కాంచన నగరి మా కన్నెమడుగు.

– వాసా కృష్ణ మూర్తి –

సీ॥ త్ప్రు వ్వని యెడ్లను దోలి కి యోయని
నీరు ద్రాపెడుపంట సేర్వరులును
వరి మొక్కలను నాటు వనితలు పాడెడు
నెయ్యపు పాటల తియ్యదనము
మేటి గిత్తల జోళ్ళ మేతకసవుల లాగు
మేరువులను బోలు మేల్మిబండ్లు
సాళ్ళు కాల్వల వోలె చాల వెడల్పుగా
పెళ్ళలజీల్చు నా గళ్ళ సాళ్ళు

గీ॥ లోతు బావుల చెరువుల నీతలందు
దూకు సేర్పుల జూపెడు తుంటరులగు
పిల్లవాండ్ల కలకలము నల్లరులును
కనుల విందొనరించెడి కన్నెమడుగు

సీ॥ చరణరథాంగముల్ హరిగమనంబులు
చారి మ జంఘతూణీరములును
శుండతుల్యోరువుల్ శ్రోణి ఖేటకములు
చారు పయోధర ఛత్రములును
కరకుంతయుగళముల్ కంఠకంబువులును
హాస భాసురచంద్ర హాస ములును
ఘ్రాణబాణంబులు రమ్య భ్రూధనువులు
నీల వేణీకర వాలములును.

గీ॥ శృఖలములకందనియువ సింహములను
దర్ప మడగించి పేటాడు దర్ప కునకు
మహిత శృంగారసైన్య సంభారములగు
కన్నెమడు గంగనల సౌరు నెన్నదరమె

గీ॥ ధరణి రాయలసీమ రత్నాలసీమ
యనెడు సామెత నిజమగు నట్లుగాను
రాల్చుచుండును ధాన్యపు రత్నములను
మడులు చేనులు మాకన్నె మడుగు నందు.

క॥ పరమాత్మ ధ్యానంబులు
పరమార్థవిచారములును పరచింతనలున్
గురు పూజలు హరి పూజలు
హరు పూజలు జరుగుచుండు ననయమునచటన్

– వాసా కృష్ణ మూర్తి

# భక్తజీవన శతకము

శ్రీ జనకాత్మజా విమల
చిత్తసరోజనివాస ! *ద్యోరమా
రాజకిరీట హీరమణి
రాజితపాద ! పరాత్పరా! భర
ద్వాజ మునీంద్ర పూజిత! వి
దారితశాత్రవ ! నన్నమోఘ ని
ర్వ్యాజ కృపావలోకనల
వారక జూడుము భక్త జీవనా ! 1

సామజపాలకా ! జలజ
సంభవసన్నుత !వేదసంతతిన్
సోమక దానవుండుగొను
చున్ జలధిన్ జొర వాని మీనమై
నామమడంచి బ్రోవవె స
నాతన పూజ్యములైన ఋగ్యజు
స్సామముఖాగమంబులను
సారసలోచన! భక్త జీవనా ! 2

*ద్యోరమా రాజః ఇంద్ర

సురలునుతింప గూర్మమయి
చొచ్చి పయోదధి మంథరాద్రి న
త్యురుతరశక్తి నెత్తియు సు
ధోద్భవ మొందగ జేసి వారికిఁ
గరుణ నొసంగి నట్టినిను
గాంచి సపర్యలఁ జేయఁ గోరుదుఁ
దరిసెన మీయ రమ్ము ముర
దానవ నాశన ! భక్త జీవనా ! 3

రక్షణ సేయ వే, ముసు ధ
రావనిఁతఁ సురవైరి యా హిర
ణ్యాక్షుడు గాసి వెట్టు తఱి
నాది వరాహమవై రమావరా!
యక్షయవైభవా ! యటుల
నాదరణంబున నన్నుగావు కం
జేక్షణ ! సౌమ్య భాషణ ! సు
రేశ్వర తోషణ ! భక్త జీవనా ! 4

నీరజ నేత్ర యంచునిను
నిశ్చల భక్తిని గొల్చు పుత్రుతో
బోరెడు నాహిరణ్యా కశి
పుఁ వధియించిన నారసింహా! నీ
నేరుపు నెంచనాతరమె.
నిర్మల సద్గుణ ! పాపవారణా !
వారణ రక్షణా ! యహిత
వారవినాశన ! భక్త జీవనా ! 5

తరుణముఁ జూచి వామనత
దానవ నాథుని యజ్ఞభంగముఁ
సరగునఁజేసి వానిని ర
సాతల వాసుని గానొనర్చి ని
ర్జరవరు కోర్కె దీరిచిన
జాణవు నీవని గొల్తు నాత్మలో
నురగశయాన! కేశవ! స
ముజ్వల భూషణ! భక్తజీవనా! 6

జనకునిద్రుంచినట్టిపగ
సంధిల నిర్వదియొక్కమారులుఁ
బనివడి బెక్కుభూపుల కృ
పారహితాత్మతజంపి భార్గవుం
డనగఁ బ్రసిద్ధి నొప్పనిను
నర్చనఁ జేయుదు సంతతంబున
న్ననుపమరీతిఁ జూడు కన
కాంబర ధారణ! భక్తజీవనా! 7

ఇనకులమందు బుట్టి మిథి
లేశుని పుత్రికఁ జెట్టబట్టి, కా
ననమును జుట్టి చుట్టి, కుల
నారి మృగాశను గోలువెట్టి య
బ్ధిని బలు కట్టగట్టి పాల
దిండిని గొట్టిన జెట్టి, రామ! నా
మనమున నట్టెనిల్వఁ గదె
మంగళరూపున భక్త జీవనా! 8

హలధర! రోహిణీ తనయ!
　　హాసమధుస్రవ రేవతీ సతీ
లలితముఖాంబుజార్క! శుభ
　　లక్షణ! యోమధు పానమత్త! నీ
విలసిత దర్శనంబు మది
　　వేమరు గోరెదఁ జూపవేలరా?
కొలుతును ని న్నజస్రమును
　　గోకుల పావన! భక్తజీవనా! 9

మరునకలభ్యలౌ త్రిపుర
　　మానినులన్ దమకింపఁ జేయు నే
ర్పరితనమున్ సురూపమును
　　భాసిలు బుద్ధుఁడవౌ భవత్పదాం
బురుహములన్ భజింతు నను
　　బుత్రునిఁ బోలె నిరంతరంబు స
త్కరుణను గావుమయ్య! నవ
　　* కంధర విగ్రహా! భక్త జీవనా! 10

కలుష వితాన గాఢతర
　　కాలబలాహకమారుతంబవై
విలసిత కల్కి రూపమున
　　వేయి విధంబుల భక్తకోటి చేఁ
గొలుపులనందు నీదు శుభ
　　కోమల పాదయుగంబు భక్తితో
దలఁతును గావరార! నను
　　దానవ నాశన! భక్త జీవనా! 11

* కంధరము = మేఘము.

క్ష్మాతలి సర్వరత్నములు
శాస్త్రము చొప్పున నెవ్వఁడేని సం
గీత మొనర్చినన్ గరగు
కేశవ! తావక చిత్త రత్నమా
రీతి గరంగఁజేయఁగ వి
రించికినైనఁ దరంబుగాదు యీ
చేతకు భక్తి యేతగు కు
శేశయలోచన! భక్త జీవనా! 12

నందకుమార! దైత్యకుల
నాథగిరీంద్ర శతార! మౌనిసం
క్రందనపంకహార! సుర
రాజమదోద్ధతహార! గోపికా
బృందవిహార! చక్రధర!
ప్రేమ సుధాఫలసార! యీ గతిన్
దందనలేలరా ? విమల
ధర్మ విచారణ! భక్త జీవనా! 13

అతుల కృపాసముద్రుఁడ వ
నంతగుణోత్తరుఁ డంచు నిన్నునే
సతతము నమ్మియుందు విర
సంబునఁ జూడగ నేల? భక్త సం
తతి పరిపాలనా బిరుదు
దప్పగ నెంచితి వేమొ లేక యీ
గతి నను నేమరిల్లుదువె
కావక శ్రీగుణ! భక్త జీవనా! 14

ధ్రువ సురవైరి డింభకుల *
తోరపుఁ గోర్కులఁ దీర్చినట్టి నీ
యవిరళ మౌ కృపారసము
నందగఁ జూచినఁబొందఁ జేయవే
సవనఫల ప్రదాయక! వి
చారణఁ జేయఁగ నేను నీకు శా
త్రవుఁడెనె ? వారు చుట్టములె?
తండ్రివి నీకిల భక్త జీవనా!

పాలనఁ జేయవే మును న
పార కృపన్ ఖలు నయ్యజామిళున్
కాలముఁ జేయువేళఁదన
గాదిలి పట్టిని నీదు పేరిటన్
దాలిమిఁ దూలి పిల్వ; కడు
దైన్యత నేనిను నెంత వేడినన్
జాలము సల్పుటేల? మది
జాలివహింపక భక్త జీవనా!

మేలనిమర్త్య జన్మమును.
మెచ్చిరి కొంద, రి దేటి మేలు ? నీ
లాలన లేక రాజ్య పద
లాభము గల్గినఁగాని, నీకృపా
పాలిత మైన నయ్యుడుత
పావన మైనదిగాఁదలంతు ను
న్మీలితపంకజోదర! య
మేయ యశోధన ! భక్త జీవనా!

* సురవైరి డింభకుడు = ప్రహ్లాదుడు.

ఏక పదంబు మోపి శిల
నింతినిఁ జేసెడివేళ నన్ను గా
రాకుగనైన దాని కడ
నావహిలంగ నొనర్చి నీదుప్ర
త్యేక పదంబు నాపయిని
నించుక సోఁకగ జేసియున్న రా
మా! కడుధన్యతఁ గనుదు
మంగళదాయక! భక్తజీవనా! 18

కంధి విహార! మౌనిజన
కంటక సంహర! రత్నహార! శ్రీ
గంధశరీర! వైరిజన
కానన శాతకుఠార! భక్తపం
కాంధిక సూర! భేదరహి
తా! గిరిధార! దయాపయోధరా!
సింధుర దుఃఖహార! తుల
సీదళ మండిత! భక్త జీవనా! 19

ఛత్రకిరీట హార నవ
చందనకుంకుమ పంకదీప్త స
ద్గాత్రముతోడ పార్శ్వమున
కంజదళాక్షి తటిల్లతాంగి భూ
పుత్రికతోడ, సర్వగుణ
పూతుఁడు లక్ష్మణు తోడ, నంజనా
పుత్రునితోడ దర్శనము
పొందుగ నియ్యవె భక్త జీవనా! 20

రమ్ము మదీయ వాంఛలంద్వ
రన్ నెరవేర్పఁగఁ, గొమ్ము నీవు నె
య్యమ్మున నేనొనర్చు భవ
దర్చనలన్ సిరితోడఁ గూడి, పా
రమ్ముగనంగఁ జాలని య
లంకృతి నొప్పెడు మోముఁ జూపుమా,
యిమ్ము మనమ్ము సంతసిల
నీప్సితముల్వెస భక్త జీవనా! 2

బోనున జిక్కు మూషికము
బోలె భవన్మహనీయ మాయచే
నానిన ఘోర సంసరణ
మందుఁ దగుల్పడి బాధితుండుగా
గాని తెఱంగుఁ జూపి నను
గావవె నిత్యము నీపదాబ్జముల్
మానసమందు గొల్చెద ర
మా హృదయాధిప! భక్త జీవనా! 22

తనయ నొసంగ బంగరపుఁ
దట్టను నబ్ధివరేణ్యుడెవ్వితా
వినయము తోడుతన్ గడిగె,
వేమరు జానకి సేవ జేయు వే
నిని, ఫణి రాట్ఫణాగ్రముల
నేర్పున నృత్యము సల్పెనేవి, వా
నిని భవదీయ పాదముల
నెమ్మి భజింతును భక్త జీవనా! 23

ధన మమకారమంది మదిఁ
దల్లడిలంగ నొనర్ప లక్ష్మి, స్త్రీ
జనమమకారమందియు వి
చారముఁ జెందగఁ జేయ మారుఁడుఁ
దిన మటు లేమరిల్లక స
తీసుతులే నినుఁ గాచియుండ నే
యనువున నిల్చు చిత్తమర
యఁ దడిమఁగని భక్త జీవనా! 24

వితతమహాప్రతాప! రఘు
వీర! జనోత్తమ భూప! భంజితా
ద్భుత శివచాప! గోపకుల
పూజిత దీప! విమోహరూప! నీ
ల తను సుదీప్త కౌస్తుభ క
లాప! విదారితభక్తతాప! నీ
యతులిత కూర్మి జూప సమ
యంబిదె పావన! భక్త జీవనా! 25

వనధి సుతా కళత్ర! *ముని
వాసవ వారిజమిత్ర! విశ్వపా
లన శుభ కార్యపాత్ర! ముర
రాక్షస జైత్ర! విమోహగాత్ర! పా
వనతర గోత్ర! పాపమద
వారణ తోత్ర! విశాల నేత్ర! రా
జ నయ కళాపవిత్ర! బుధ
సత్తమపాలన! భక్త జీవనా! 26

* మునివాసవ = మునీంద్ర

పారము లేని పాప ఫల
భారము, దుర్విషయాలవాల కూ
పారము; * శ్రాద్ధదేవపరి
పాలిత సారము ఘోరమైన సం
సారము సారమంచనిరి ?
సారసలోచన! యిందునీకృపా
సారము బొందకుండిన, న
సారతఁ జెందదె భక్త జీవనా! 27

సారము సర్వవేదఫల
సారము, సూరి జనోత్కరైక మం
దారము, పాప భూధర శ
తారము, శ్రీకర దివ్య యోగసం
భారము శాశ్వతామృతవి
భాసిత సారము, నీమనోహరా
కారము రామచంద్ర నను
గావగఁ జూపవె భక్త జీవనా! 28

ఎవ్వని వేడుదుర్మదిని
నెవ్వని నమ్మి భజింతు ? దిక్కటం
చెవ్వని నెంతు ? దైవమని
యెవ్వనికే నొనరింతు పూజ; లే
నివ్విధి నీకృపారసము
నించుకనైనను జూపకున్న నో
కవ్వడి సంగడీఁడ! తొగ
కన్నులరాయఁడ ! భక్త జీవనా! 29

★ శ్రాద్ధదేవ = యముడు.

అంబర వీధి నుండి నిఖి
లావని పాతము నొందు వారివా
హాంబువులెల్లఁ జేరు వరు
ణాలయమున్ దలపంగ నట్లు చ
ర్మాంబరముఖ్య దైవనివ
హార్చనలన్నియు నిన్నుఁ చేరవే!
కంబుగ దాసి చక్ర వర
కార్ముక ధారణ! భక్త జీవనా! 30

నీదయ నీదు దర్శనము
నీమృదుభాషన నాలకించుటల్
నీదు ప్రియంబునందుటయు
నీనిజపాదసరోరుహార్చనల్
పేదకు పెన్నిధానము ల
భించిన రీతిగఁ గల్గకుండినన్
గాదె నిరర్థకంబు శుభ
కర్మల యందున భక్త జీవనా! 31

నే మును జన్మలన్ మనసు
నిల్పి నినున్ వినుతింపకుంటచే
నీమహిఁ వెండియున్ జనన
మేర్పడె, నీపద పంకజంబులం
దేమరకుండఁ చిత్తము ర
హింపఁగఁ జేసియు నుద్ధరింపవే
ప్రేమము జూపి దైత్యవన
భీషణ పావక! భక్త జీవనా! 32

ఈశ! సురారి నాశ! భువ
నేశ! నిరాశ! పరేశ! తారిత
క్లేశ! పవిత్ర మౌని జన
కీలిత సత్ప్రియ పాశ! సూరసం
కాశ! శుభ ప్రకాశ! వర
కంధిసుతా పరిశుద్ధ చిత్త ప
ద్మేశ! వినీల కేశ! తర
ణీందువిలోచన భక్త జీవనా! 33

తల్లి యుఁ దండ్రి ప్రేమలక
తంబునఁ గొంత, మదంబుచే నవో
త్పుల్ల సరోజలోచనల
పొందులకొంత, సుతాలి రాగమం
దుల్లసమంది కొంత, నమి
తోన్నత మౌ ద్రవిణార్జ నంబునన్
దల్లడమంది కొంత, గత
దార్ఢ్యతఁ గొంతయు, నాయు వేగగా
గల్లరి జన్మ ధన్యమగు
కాలమదెప్పుడు భక్త జీవనా! 34

పారములేని విశ్వమునఁ
బ్రాణులఁ గొన్ని సృజించి, యవ్వలన్
దీరని క్షుత్పిపాసల వి
ధింపఁగఁ, గామ ముఖారి వర్గముల్
చేరి స్వకార్యజాలములఁ
జేయఁగ, నాటక మాడెదీవు నీ
నేరుపునెంచ నాతరమె
నిత్యదయాగుణ! భక్త జీవనా! 35

 – వాసా కృష్ణ మూర్తి –

అరుసము గల్గి నీదు చర
　　ణాంబుజ సేవలొనర్పకుండి నే
నిరతము కుక్షిపోషణకు
　　నీచుల దాస్యమొనర్చినందునన్
వరుసగ నాదు జన్మములు
　　వ్యర్థములయ్యెను బ్రోవరాగదే
కరుణ దలిర్ప సర్వముని
　　కామిత దాయక భక్త జీవనా! 36

కలుముల రాణి జాయయని
　　గాదు, జగత్త్రయ సృష్టి కార్యకౌ
శల గురువర్యుఁడానలిన
　　సంభవుఁడాత్మ జుఁడంచుఁ గాదు, నిన్
గొలుచుట భక్త పాలనము
　　కుంఠింతరాగరసైకవాహినీ
జలజమటంచు సారసవి
　　శాలవిలోచన! భక్త జీవనా! 37

నరమృగరూప! వైరి శమ
　　నా! శమనవ్య గుణాభిరామ! భా
స్కర శత తేజ! తల్పభుజ
　　గా! భుజగాశనపింఛ భూషణా!
నరసఖ! పాపమేఘపవ
　　నా! పవనాత్మజసేవితా! సుధా
కరహరినేత్ర! కీర్తి కన
　　కా! కనకాంబర! భక్త జీవనా! 38

ప్రియతమ మయ్యు నేరికిని
    పీడ నసాధ్యములైన యాషణ
త్రయము నెసంగి యుండ, వసు
    ధాసుత, మామకమాత సీత నా
రయుచుఁ బ్రలాపమందితివి
    రామ! భవత్సృజితాత్మజుండ నే
నయివిలపింప నీ హృదయ
    మార్ద్రత జెందదె భక్త జీవనా! 39

వింటిని గర్ణ పర్వముగ
    వేమరు నీచరితంబు, నాశతో
నుంటిని యెప్పుడైన దయ
    నొందెద వంచని, గోర్కెలూరగా
మంటిని, సాటి లేని కడు
    మూర్ఖుఁడనై యిపుడైన గావర
మ్మంటిని రామచంద్ర! నను
    నార్త జనావన! భక్త జీవనా! 40

బాలుఁడ బుణ్యహీనుఁడ న
    పారశఠుండ మదోద్ధతుండ దు
శ్శీలుఁడ పాపకార్యచర
    శేఖరుఁడన్ విమలాత్మకా! జగ
త్పాలుఁడ వీవు నన్నొకనిఁ
    బాలన జేయఁగ లేవె? శ్రీరమా
లోల! శ్రితావనా! కమల
    లోచన! శ్రీగుణ భక్త జీవనా! 41

అనయము నిన్భజించుటల
నారయకెల్ల నసత్యమంచు నీ
మనమున నెంచితేమొ నను
మన్ననఁ జేయవు విశ్వమెల్లెడఁ
దనరుచునున్ననీకునిది
దాగునె యిట్లు పరాకు లేక నా
వనటను దీర్పరా! కలుష
వారవినాశన! భక్తజీవనా! 42

కాదనకుండఁ బేదయును
కల్గినవారలు కల్గువానికే
లేదనకుండ నిత్తురను
రీతిని నేర్పడె నీదు చేత, ప్ర
హ్లాద ధ్రువాదులఁ గరుణ
లాలనఁ జేసియు బీద నౌట నా
మీఁదనుపేక్షఁ జేయుటన
మీకిది చెల్లునె భక్తజీవనా! 43

చతురవిలాసముఁ బరపి
చంచల నిన్నరి కట్టె నేమొ, దే
వతతిసపర్య మెచ్చి మది
వశ్య మొనర్చితి వేమొ, లోకపూ
జితులగు మౌనియోగబల
సిద్ధిని బంధితుఁడైతివేమొ, నా
గతిగనరావు! కారణము
గానను పావన! భక్తజీవనా! 44

యదుకుల బాల! మౌని హృద
యాంబుజలోల! త్రిలోకపాల! స
మ్మదయుతశీల! కిల్బిష వి
పాటన ఖేల! మదారికాల! శ్రీ
ప్రదసుగుణాలవాల! మద
బంభర నీలసుకేశజాల! ని
ర్మద సుజనానుకూల! ఖల
మర్దన! పావన! భక్తజీవనా! 45

వదనము కంజమంచు, నిడు
వాలుకనుంగవఁ గల్వలంచు, నిం
పొదవెడు పాదయుగ్మమరు
ణోజ్జ్వల పద్మములంచు, గాత్రముఁ
మృదుల శిరీష సూనమని,
మెచ్చి నినుఁ వినుతించిరేల? నీ
మది కడుఁగర్కశంబు బుధ
మానస చంద్రమ; భక్తజీవనా! 46

ఎటుల నుతింప మెప్పగునొ
యెట్లు జపింపగ సంతసింతువో
యెటుల నుతింప ప్రీతియగు
నెట్టుల ధ్యానముఁ జేయనొప్పునో
యెటుల నమస్కరింపమది
కింపౌ, యెరుంగఁగ జాలఁ గల్పనా
నటన కళాధురీణ! నిను
నమ్మితి బ్రోవవె? భక్తజీవనా! 47

భక్తులనేకులఁ గడుఁగ్ర
　　పాపమతిఁ బ్రోచితివంద్రు; నమ్మనా
యుక్తుల సత్యమంచు నను
　　నొక్కపుడైన ప్రసన్నమై మహా
సక్తినిఁ బావ దర్శనము
　　సంగినఁ గాని కృపామయాత్మ కా!
ముక్తి నిధాన! శ్రీ హృదయ
　　మోహన! సద్గుణ! భక్తజీవనా ! 48

వరద! భవత్కృపా త్రి దశ
　　వాహినిఁ గల్గెడి లీలలఁ ఋషో
త్కరముల మౌని జాలిక వి
　　తానము ధ్యానమహీలతావలిఁ
సరగున గ్రుచ్చి యోగ బడి
　　శంబులఁ బట్టి సుఖింపుచుండ గొ
క్కెరనగు నాతలంపు కృత
　　కృత్యతఁ జెందునె భక్తజీవనా ! 49

పట్టెడు కూటికై వివిధ
　　బాధలఁ జెంది, భవత్పదంబులఁ
గట్టిగ నమ్మకే ధనవి
　　కారమదాంధుల సేవఁజేసి బల్
రట్టడిఁ జెందు వారిగని
　　త్రాసముఁ జెందుచునుందు. దేవ నా
కట్టి విధంబు దూరమగు
　　నట్టులొనర్పవె భక్తజీవనా ! 50

నీ కనుదమ్ములన్ వెడలు
నిర్మలమౌ కరుణామరంద మ
స్తోక ముదంబు బెంపొదవి
తుష్టిగ మామక చిత్త బంభరం
బాకలిఁ బాయఁ గ్రోలునటు
లాదరణంబునఁ జేయవే సురా
నీకనుతాంఘ్రి పద్మ ! నవ
నీరద విగ్రహా! భక్తజీవనా ! 51

భక్త జనోత్కరోగ్రతర
పంకఫణీశవిపాటనోద్ధతా
సక్త సుపర్ణ! విక్రమ వి
శాల! కఠోర గుణాతిరేక సం
యుక్త మదారికానన *మ
యూఖ రసజ్ఞ! పవిత్ర పాలనో
ద్యుక్త రమావరా ! కరుణ
తో నను గావుము భక్తజీవనా ! 52

పాపవినాశనం బొనరు
పజ్ఞ రఘు రాముఁడ వయ్యు నీవయో
ధ్యాపురి నేలు కాలమునఁ
దావక సేవలొనర్చి భక్తిచే
నీపరితోషమే తమకు
నిర్మల మోక్షమటంచు నెంచు వా
రీపుడమిన్ పునర్జనన
మేవిధి గాంతురు భక్తజీవనా ! 53

మయూఖరసజ్ఞ = అగ్ని

– వానా కృష్ణ మూర్తి

అనిలజు చేత ముద్రిక ధ
రాత్మజ కంపుటయున్ విరోధుల౯
హననమొనర్పకుండియెర
యంబున రాజ్య పదంబు పట్టమా
యినజునకు౯ విభీషణున
కేపునఁ గట్టుటెఱుంగ కజ్ఞులె
ల్లను నరుఁడంచుఁ బల్కుదురు
రాముఁడవౌనిను భక్తజీవనా! 54

వైరి విదారణంబొనరు
ప౯ శర చక్రము లంపునాఁడె యీ
ధారణి తల్లడిల్లెనట
తావక కోపము గాక యద్ది ని
స్సారతరాయుధ ప్రకర
శక్తియె? త్వత్కృథ నించుకైన నా
ఘోర తరాఘమం దనిపి
కూలగఁ జేయవె భక్తజీవనా! 55

ఎన్నడు విందు వో మనవి
నెన్నఁడు నాపయి ప్రేమ కల్గునో
యెన్నఁడు నిన్ను జూతునని
యేను నిరీక్షణ బుద్ధి నుండి నా
కన్నులుగా చెఁగాయలు వి
కాసిత నిర్మల పంకజాక్ష! యా
పన్నుఁడ నన్నుఁ గావర! కృ
పామతి పావన! భక్తజీవనా! 56

 

సరసిజసూతి శ్వేతుఁ డని,
శర్వుఁడు కాలగలుండటంచు శ్రీ
హరి ఘననీలవర్ణుఁడని
యందు రదెందులకన్న? భక్తపా
పరహిత కార్యమందున న
పారము నీవు శివుండు స్వల్పముఁ,
దురితవహంబొనర్చుటను
దోచెడి నీలిమ భక్తజీవనా! 57

నీ పద పంకజంబులను
నిండిన భక్తి ని గొల్తు నీవె నా
ప్రాపగు బాంధవుండవని
పాయక యెంతు, భజింతు నీవె సం
తాపముఁ బాపు వాఁడవని,
తావక నామమె సంస్మరింతు, నా
పాపములన్ హరింపఁగదె
పంకజలోచన! భక్తజీవనా! 58

పన్నగ రాజతల్ప! శిశు
పాలమదాపహా! లోక రక్షణో
ద్భిన్నదయాంబుజాత! బల
భేది ముఖామర వంద్య, దివ్యసం
పన్న గుణాతిరేక! భవ
బంధ విమోచన! ప్రేమ మీర నా
విన్నపమాలకించి నను
వేగమె బ్రోవుము భక్తజీవనా! 59

రామ ! గుణాభిరామ ! రఘు
రామ ! మనోహర సీమ! మానినీ
కామ! మునీంద్ర సద్హృదయ
కంధి నిరంజన సోమ ! యంచునే
నేమరకే నిరంతరము
నే పగు భక్తిని నీదు దివ్య మౌ
నామమునే దలంచు మది
నాకొన గూర్పవె ? భక్తజీవనా ! 60

కాయము నిల్చు నంతదను
కన్నినుఁ బ్రస్తుతిఁ జేయుచుందునే
బాయక నాదు ప్రాణములఁ
బాసెడి వేళ భరింపరాని వౌ
నాయమ బాధలన్ బడి స్వ
హట్జెడి పోవు నొ యేమొ కావగా
నీయదె భారమౌ విమల
నీరజ లోచన! భక్తజీవనా ! 61

కాదన బోకు దీన జన
కల్ప రుహంబగు నీ యశోన్నతిన్,
రాదనబోకు భాగవత
రక్షయొనర్చిన నాటి నీ కృపన్
లే దనబోకు దాసతతి
లేముల బాపెడు దివ్యశక్తి, నీ
పాదయుగంబె దిక్కనుచుఁ
బాయక నమ్మితి భక్తజీవనా ! 62

మేలగు భక్తిచే నిను న
మేయ దయాకర! రామ చంద్ర ! గో
పాల ! సువర్ణ చేల ! ముని
బాంధవ! కృష్ణ! మురారి! గోపికా
లోల! జనార్దనా! యనుచు
లోలుభులై స్మరియించు వారినిఁ
కాలుఁడు తేఱి చూచునె యె
గాదిగనైనను భక్తజీవనా ! 63

దుర్విషయంబులఁ దవిలి
తుష్టియొకింతయులేక యెల్లెడఁ
బర్విడుచుండు నామనసు
బట్టినినుఁ బొగడంగఁ చాలనో
సర్వమయా ! దయా పరవ
శంబున నాదు విలోకనాళికిఁ
బర్వముగాఁ గఁ గన్పడి య
భాగ్యత దీర్పవె భక్తజీవనా ! 64

పలువల చెల్మిఁ బూని యతి
పాపపు బుద్ధి, నొకప్పుడైననిఁ
దలపక, నీపదాబ్జయుగ
దాస్యమొనర్పక, నీదు దాసులఁ
గొలువక, కాలమిప్పగిది
గోల్పడి నేటికి నిన్నె నమ్మతిఁ
గలుగునె నీ కృపారసము
కంధి సుతావర! భక్తజీవనా ! 65

 

పరిణయవేళ సిగ్గున భ
వత్సముఖానత శీర్ష జానకీ
తరుణి యురస్థ దివ్యమణి
దర్పణమందునఁ దోఁచి యామెనున్
పరవశమందజేసినటు
భావమణిన్ వెలుగొంది నన్నునీ
కరుణకుఁ బాత్రుఁ జేయగదె
కామితదాయక! భక్తజీవనా! 66

హితమిత సౌమ్య భాష! దను
జేశ్వర వంశపయోధిశోష! పం
డితజన పోష! భక్త జన
★డింబ తుషార వినాశపూష! శ్రీ
యుత రమణీయ వేష! వర
యోగి జనావనతోష! పాలనా
చతురమనీష! నిన్ను మది
సన్నుతిఁ జేసెద భక్తజీవనా! 67

నెఱితనమంది నీ విమల
నిర్గుణ తత్వము పొందు లభ్యమె
త్తఱికగు నంతదాక మదిఁ
దావక సుందర మూర్తి పూజలే
మరక సదా పవిత్రతర
మానసతం బొనరింపుచుందు నే
గఱువున గంజియైన సుధ
గా మది దోపదె భక్తజీవనా! 68

★డింబ = భయము

కుడి యెడమల్ రవంతయును
గూడ నెఱుంగక యుంట మేలు, నే
ర్పడర వివేకియై యహో‌ర
హంబు నిన్నుఁ దెలియంగ మేలు, యీ
నడుగతియైన జన్మమును
నాకొనఁ గూర్చియు నిట్లు రెంటికిఁ
జెడిన త్రిశంకు నాకమటు
జేసితి వేలొకొ భక్తజీవనా ! 69

అంతములేని రూపుఁడ వ
యాచిత కామిత దాత, వాదిమ
ధ్యాంత గుణత్రయేతరుఁడ,
వౌ నిను నామదిఁ బ్రస్తుతింప నా
వంతయు నాపయుఁ గరుణ
నావహిలంగ నొనర్ప వైభవం
బంతయు వ్యర్థ మౌనె తమ
కార్త జనావన ! భక్తజీవనా ! 70

తిన్నని కృష్ణ జన్మమున
దేవసుమంబగు పారి భద్రమా
యన్నులమన్న సత్య తన
కద్ది ఘటిల్లక కాలఁదన్నగా
మన్ననఁ జేసి, నేను పలు
మారిటు వేడిన బ్రోవవేలరా!
తన్నునకన్న విన్నపము
తక్కువ యయ్యెనే. భక్తజీవనా ! 71

 

నగుమొగ మించుకంతయుఁ గ
నంబడ జేయుదువంచుఁ గోర్కెచేఁ
బగలును రేలు నిన్న మిత
భక్తి భజించితిఁ గానరావు నా
వగపు రవంత నీ శ్రవణ
వల్లరులందున నంటదేమొ యీ
బిగువది యేలరా! కుసుమ
పేశల ! మోహన ! భక్తజీవనా ! 72

శరణను వారి బ్రోతునని
చాటి జగంబుల దీన రక్షణా
భరణముగాఁగఁగంకణము
పాణితలంబునఁ దాల్చి నన్ను నీ
కరణి నుపేక్షఁజేయఁగను
గౌరవ మిట్లని చాటకుందునే
కరుణను జూడు మారజన
కా ! నరకాంతక! భక్తజీవనా ! 73

గొప్పతనంపు వాఁడవని
కొల్చితినిట్లు నిరాదరింతువం
చెప్పుడెఱుంగ నుస్సురని
యే విలపింప దదీయ పాపముల్
దప్పునొ తాకునో తెలియ
దా ? సకలంబు నెఱుంగ వాఁడవే
యిప్పటికైన నన్ను దయ
నేలర ! పావన ! భక్తజీవనా ! 74

*ఆనక దుందుభిఁ సుతుఁడ
వై యలరించి, యశోద పెంపగా
ధేనుగణంబు నేలుచును,
ధీరతఁ గాళియుఁ దోలి, గోపికా
మానస వల్లభుండవయి,
మామను గంసు వధించినట్టి ప
ద్మానన బ్రోవరా! సురవ
రార్చిత ! మోహన ! భక్తజీవనా ! 75

లోక గురుండవై, సుజన
లోక హితాస్పద కార్య లక్ష్యతా
లోకివియై, త్రయీ భువన
రోచనుఁడై, విరతేచ్ఛనుండు న
స్తోక గుణాఢ్య ! శాంతి యుత !
శోభన రూపక ! జన్మతారకా !
నీకెదె వందనం బమల
నిత్యనిరంజన ! భక్తజీవనా ! 76

యోగిని గాను నేను మరి
యోగ రహస్యమెఱుంగనించుకఁ
భోగమె కోరునామనసు
భోగము యోగము నొక్కచోట సం
యోగము నందు నే తమము
నుజ్వల తేజము నొక్కటౌ నె యీ
భోగము వీడి యోగమును
బొందగ జేయుము భక్తజీవనా ! 77

*ఆనక దుందుభి = వసుదేవుడు

లోకము సర్వముఁ దమకు
          లోబడి యుండెను నేను సైతముఁ
మీకు వశుండనయ్యు మది
          మీపయి నిల్వ కనాది యౌచు బ
ల్గాకితనంబునఁ దిరుగ
          లాగిత్వదీయ పదాంబుజంబులం
దేకము జేసితిఁ గొనుము
          యయ్యదెకానుక భక్తజీవనా ! 78

బాలుఁడ దీనుఁడఁ, విగత
          భాగ్యుఁడ, మూఢుఁడ, దిక్కులేని కా
కోలము కావు కావు మని
          కూయిడు రీతిగ నిన్నె వేడితిఁ
యేలెదవంచు నమ్మికొని
          యేలర జాలిని బూనవైతివే ?
తాలిమి దూరమయ్యెనిఁకఁ
          దాళగ జాలర భక్తజీవనా ! 79

పిట్టకుఁ జెట్టు, తీవకును
          బిట్టగు పందిరి, గాలిదిండికిఁ
బుట్టయుఁ, దమ్మికిఁ జలము,
          పొట్టకుఁ బట్టెడు కూడు, భక్తిచే
నెట్టన నమ్మ దాసులకు
          నీకృప గాక మరేది దిక్కటం
చిట్టుల నిన్ను వేడితి గ
          జేశ్వర పాలన ! భక్తజీవనా ! 80

దండము రామచంద్ర! భవ
తారక నామ! యభీష్ట దాయకా!
దండము కీర్తి సాంద్ర! సుర
తాపనివారక! లోకనాయకా!
దండము జానకీంద్ర! నృప
తల్లజ! దీన జనార్తి హారకా!
దండము నీకుపేంద్ర! వర
ధర్మ విచారణ! భక్తజీవనా! 81

*శ్రీవరుఁడై జగత్త్రయము
సృష్టినొనర్చుచు. నింది రేశుఁడై
బ్రోవుచు. వాని వెండియును
భూత గణాధిపుఁడై హరించుచుం
బావన మూర్తియై కడు శు
భక్రియ నొప్పెడు నీవు దక్క దీ
నావన కార్యధుర్య బిరు
దార్హులెవ్వరు ? భక్తజీవనా! 82

ఎల్లెడ వ్యాపకుండవని
యెంచి నిన్గని సీతలంకలో
దల్లడ మందియుఁ మదిని
ధైర్యముచే మరణింపకుండె నీ
చల్లని మోముగన్గొనక
సర్వమయా! యెటుతాపమారు ? నా
యుల్లము పల్లవింపగ ద
యోన్నతిఁ జూపుము భక్తజీవనా! 83

శ్రీ = సరస్వతి

జలఘట భిన్న రంధ్రమున
జారెడు బిందువులట్లు నిత్యముఀ
దలఁగుచు మెల్ల మెల్లన వృ
ధాయగు చున్నది యాయువెంత నిఀ
దలచిన గాని నీ కరుణ
దాసునిగా నను నెంచి బ్రోవవే
విలసిత రూప! భూభరణ!
వేంకట నాయక! భక్తజీవనా! 84

నిరతము రామ రామయని
నిన్ను మనంబునఁ జింతజేయఁగా
దురితము వెల్గు గన్గొనినఁ
దోరపుఁ జీకటులట్లు దూరముఀ
బరువిడునంచుఁ బెద్దలను
పల్కుల నమ్మి యపారభక్తిచే
స్మరణముఁ జేయు చుంటి నిను
సప్తగిరీశ్వర! భక్తజీవనా! 85

తరణికులేశ! సర్వవర
దా! వరదాన మహా ప్రవీణ! భూ
ధర సమధీర! జ్ఞాన భరి
తా! భరతాగ్రజ! దేవ దేవ! సం
గర తలవీర! పక్షితురఁ
గా! ★తురగార్తి దవానలాబ్ద! భా
స్వరతర దివ్యపాదవన
జా! వనజాంబక! భక్తజీవనా! 86

★ తురగ = హృదయ



– వాసా కృష్ణ మూర్తి

కలగను వేళనైన నినుఁ
గాంతునటంచుఁ దలంప లోకమం
దలి వివిధంపు గృత్యములె
దర్శనమౌటయె గాని, నీదుస
ద్విలసిత మోహనాకృతి మ
దింబొడఁ గట్ట దదేమి పాపమో
తలఁపఁగ రాదు నీవిమల
దర్శనమియ్యవె భక్తజీవనా! 87

ఎందరఁ బాపులన్ కరుణ
నేలవు సత్కృప దుఃఖితాత్ములిం
కెందఱిఁ బ్రోవవో సరసి
జేక్షణ! వీరల యందు నీకు నే
బొందని భారమైతినె? త
పోజనసేవిత! నాదు వాంఛలా
యందని పండ్ల కాశపడి
నట్టులనయ్యెనె! భక్తజీవనా! 88

అమరులవీటనైన నిట
లాక్షునివాసమునైన, దివ్యమౌ
కమలజు లోకమైన సిత
కంజవిలోచను సద్మమైన, నా
దు మనము నందుఁ గోర భవ
దుఃఖహరంబగు నీదు దర్శనం
బమితదయాకరా!! యొసఁగ
నాత్మఁ దలంచెద భక్తజీవనా! 89

వారణ యూధనాథ భయ
వారణ వారణ కార్య కౌశలా!
★నారదనీల ! పాప శిఖ
నారద! నారదమౌని వందితా!
నీరజ నాభ! భక్త జన
నీరజ నీరజ మిత్ర సన్నిభా!
★★తారక హార తామరస
తారక! తారక! భక్తజీవనా ! 90

నను@ గరుణించినంతట న
నాథశరణ్యా! పవిత్ర కీర్తి క్రుం
గునె? భువనాధి పత్యమిల
గోల్పడునే ? నునుసోయగంబు పా
రునె? నవసద్విలాసములు
లుంఠితమౌనె ? యగౌరవంబు నీ
కొదవునె? సంపదల్విరతి
నొందునె ? శ్రీవర! భక్తజీవనా ! 91

నయగుణశీల ! ఘోరమగు
నాదురితంబును బాపగా@ గృపా
మయుఁడవు నీవె చాలుదని
మానక నేమొర వెట్టుచుండ నే
మియు నెఱుగంగ నట్లు విర
మించిన దిక్కెవరయ్య ! యింత ని
ర్దయత గునా ? మదీయ హృది
తాపము బాపుము భక్తజీవనా ! 92

★నారద = మేఘము ★తారక = కన్ను, ముత్యము


– వాసా కృష్ణ మూర్తి

ఎచ్చట నుంటివో యెఱుఁగ
నీశ్వరలోకమొ, ధాతృవాసమో,
ముచ్చటఁ గొల్పు విష్ణుపుర
మో, బలి సద్మమొ, దేవ రాజ్యమో,
సచ్చరితాత్మ! నా మొర ప్ర
సారితమై శ్రవణంబులం దొగిఁ
జొచ్చెనో లేదో నన్నుఁదయఁ
జూడవదేటికి భక్తజీవనా! 93

పాలును నేయి చక్కెరల
పాయస మొల్లవు, బోయ ముద్దరాల్
మేలిమిఁ జూచి యెంగిలిని
మెచ్చి భుజించితి వేమొ, యౌరనీ
లీల లెఱుంగ శక్యమె! భ
లీ సుగుణాఢ్యుఁడవీవు యీపరా
కేలర? యేలరా! కరుణ
నెంచి మనంబున భక్తజీవనా! 94

రక్షకుఁడంచు నవ్య మణి
రాజివి రాజిత సౌఖ్యదాయకా
ధ్యక్షము దైత్యరాజపుర
తారము, లంకను వీడి నీకృపా
భిక్షను గోరి కొల్వఁగ వి
భీషణుఁడార్తి నిఁ జేరె సేవకో
పేక్షకుఁడంచు నిన్నెఱుఁగ
బెట్టునె పాదము భక్తజీవనా! 95

రాజకిరీట దివ్యమణి
రాజవిశుద్ధమయూఖ కాండనీ
రాజితపాద పంకజవి
రాజిత రాజబిడౌజుఁ డానలుం
డోజ యొకింతలేక విభ
వోన్నతిఁ బాసి చరించె నీదయా
తేజము దప్పికాదె జగ
తీపరిపాలక! భక్తజీవనా! 96

భాసుర పంకజోదర! స
భాభవనంబున నంబరంబు దు
శ్శాసనుఁ డీడ్వ ద్రౌపది వి
శాలవిలోచన నిర్గతామృతా
భాసముఖాబ్జయై నినుఁ గృ
పామతిఁ బ్రోతువటంచుఁ బిల్వ గృ
ష్ణా సదయాక్షయాంశుక మొ
సంగియు బ్రోవవె భక్తజీవనా! 97

శరణను వారి బ్రోతువు ప్ర
శాంతమనస్కుఁడ వాది దేవ! య
ధ్వరఫలదాయకుండవు ని
వారిత భక్త భయుండవౌ భవ
చ్చరణ సరోరుహంబులకు
సాగిలి మ్రొక్కెడు నాదు శీర్షమె
వ్వరికి నమస్కరింపనటు
వాంఛను దీర్పవె భక్తజీవనా! 98

పన్నగ కిన్న రామర స
పర్యల నొందెడి నీవు మన్మనో
త్పన్నము చంపకోత్పల శ
తంబగు మాలిక దాల్చి ప్రేమతో
కన్నకుమారు రీతి నను
గావుము నిర్దయ తోడఁ జూడకా
పన్నుఁడ మంద భాగ్యుఁడ కృ
పాభరితాత్మక! భక్తజీవనా! 99

మంగళ మిందిరేశ! జయ
మంగళ ముజ్జ్వల చక్రధారణా!
మంగళ మంబు జాక్ష! శుభ
మంగళ మీశ్వరా! నిరత
మంగళ మార్త జనావనా! హరే
మంగళ మీశ్వరా నిరత
మంగళ దాయక! భక్తజీవనా! 100

ఇది

శ్రీ రామ చంద్ర శారదాంబా కరుణా కటాక్ష భవిత కవితోచ్చారణ పాత్ర కాశ్యపగోత్ర కువిందకులపయః పారావార రాకాసుధాకర వాసామల యార్య చంగమాంబా గర్భశుక్తి ముక్తాఫల కృష్ణమూర్తి నామధేయ కవి విరచిత

భక్తజీవన శతకము సమాప్తము.

శ్రీ కృష్ణార్పణము

# శ్రీ వేంకటేశ్వర దండకము

జయ జయ వకుళా సుతా! భవ్యయోగాన్వితా దివ్య భోగాన్వితా ! శేషశైలాగ్రమాణిక్య ! గోపీ మనోల్లాస కృద్రాగ రాసిక్య ! పద్మావతీ చిత్త మందార సార్లజ్ఞ! సమ్మో దితప్రాజ్ఞ! దేవాది దేవా ! మహాప్రాభవా! దేవ ! ఆలోకనావ్యక్త సన్నిత్య కల్యాణ సౌభాగ్యముల్ నొందుచున్ మెచ్చుచుందీవు. ఆలోకనావ్యక్త మాయాన్వితంబైన యీ విశ్వకళ్యాణ సౌభాగ్యమున్నిచ్చుచుందీవు. నీలీల చేగల్గు మాయారహస్యంబు నేలీల నెవ్వారునుంగానివర్ణింపగా లేరు. దివ్య ప్రభావా! నన్నుగావరావా! మహాదేవముఖ్యార్చితా! సాధు సంకీర్తితా ! స్వర్ణ శృంగ ప్రభా భాస దివ్యాలయా ! సర్వలోకాభయా ! నీవె మాదిక్కు వల్మీకవాసా ! మహా శ్రీనివాసా ! లసద్వేంకటాద్రీ మహోద్యాన నింబామ్ర ఖర్జూర శ్రీ గంధ మందార పున్నాగ ద్రాక్షాది ఛాయా విహారీ ! జగస్తుత్యశౌరీ ! సువర్ణాబ్జ కాసా రతీరేందిరా పూజితా ! దర్శనార్థాగత స్త్రీ ముఖ స్మేర చాంద్రీ ప్రభారాజి నీరాజితా ! చంద్రచూడప్రియా ! సర్వలోకాలయా ! అంజనా పర్వతాగ్రంబునందెన్నియో వాహినుల్గల్గు తత్తీర విస్తారమౌ సైకత ద్వీప భాగంబులన్ మంగతాయారుగారైన దేవేరితో గూడి వాహ్యాళినోలాడు కోనేటి రాయా ! వచోనర్మ భావోల్బణా నందితాత్మీయజాయా! మహాలక్ష్మిచే సేవలన్ బొందుచున్ నీవు పద్మావతిన్ బెండ్లియాడంగ ద్రవ్యార్థివై యాకుబేరాశ్రితుండైతివే యేమినీ లీల యో వెంకటేశా! రమేశుండవై రాజరాజన్ మహౌత్సుక్య బ్రహ్మోత్సవారాధితా! భక్తసమ్మోదితా ! అన్న మాచార్య సంకీర్తితానేక గేయావళీ హారమున్ గొన్న నీదౌ యశస్సౌరభంబెల్లలోకంబులన్ నిండగన్ వెంకటేశాఖ్యతో వెల్గు చున్నావు

- వాసా కృష్ణ మూర్తి -

దేవా! భవచ్చిత్ర చారిత్రముల్ జూడమాయామావిచిత్రీ కృతంబౌ
మహాశేషపర్యంక! యోవైనతేయాంక! కైరాత వేషంబుతో నీవు పద్మావ
జూచి యాకాంత రువ్వించు రాల్నీదుకా యంబు గాయంబుజేయంగ నీయం
మౌరూపు యామారుతూపై తదీయాంబుజాక్షీ మనం బెంతయోమా
రానట్టి గాయంబు గాజేసె నీకున్ మరిన్ నీదు కాంతాళికిన్ మధ్య కంద
మధ్యస్థ మేలయ్యె? నీవే యనేకాంగజవ్రాత సౌందర్యుడైయుండ నీచర్య
నీదు భావంబులత్యద్భుతంబుల్ యికన్ జాలు నీవర్ణనల్ వర్ణనాతీ
నివ్వర్ణనంజేయ నీకాలమే చాలదయ్యా! నినున్ వర్ణనల్చేయ బ్రహ్మాద
చాలరయ్యా! నిన్నున్ వర్ణనన్ చేయ నీజ్ఞానమే చాలదయ్యా నిన్నున్ వర్ణనన్ చే
నీ విద్యయే చాలదయ్యా! నమస్తే నమస్తే నమస్తే నమః.

శ్రీ కృష్ణార్పణము

: సమాప్తమ్ :

 – వాసా కృష్ణ మూ